"ఆంధ్రప్రదేశ్" పత్రికలో ప్రచురిస్తూ వచ్చిన కొన్ని గేయాల సంకలన
యిది. వీటిలో చాలా వరకు దేశవ్యాప్తంగా జరుగుతున్న
అభివృద్ధి కార్యక్రమాలను గూర్చి, ప్రజాహిత ప్రయోజనాలను
గూర్చి, కొన్ని మటుకు సాంస్కృతిక, సాంఘికాదర్శాలను
గూర్చి రచింపబడ్డవి. రాష్ట్రంలో వివిధ నిర్మాణ
కార్యక్రమాల్లో పనిచేస్తున్న వారికీ,
ప్రచారోద్యోగులకూ, ఇతరులకూ
ఈ గేయాల సంపుటి
ఉపకరిస్తుంది.

# విషయ సూచిక

—:o:—

# మతం

—దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి

నారాయణ! నారాయణ!
అల్లా! అల్లా!
నా పాలిటి తండ్రీ, నీ పిల్లల మేమెల్ల!

మత మన్నది నా కంటికి మసకైతే,
మత మన్నది నీ మనసుకు మబ్బైతే,
మతం వద్దు, గితం వద్దు
మాయా మర్మం వద్దు-నారాయణ! నారాయణ!

ద్వేషాలూ రోషాలూ తెచ్చేదే మతమైతే,
కలహాలూ కతలు కలిగించేదే గతమైతే,
మతం వద్దు, గతం వద్దు
మారణ హోమం వద్దు-నారాయణ-నారాయణ!

మత మన్నది గాంధీ జీవితమైతే,
మత మన్నది లోకానికి హితమైతే,
హిందువులం ముస్లిములం
హిందువులం క్రైస్తవులం
అందరమూ సోదరులం
అందరమూ మానవులం-నారాయణ! నారాయణ!

జానపద గేయం

# సదువు కావాలోయ్

(గ్రామీణుల కొరకు వయోజన విద్యా ప్రచార గీతం)

—చెఱుకుమిల్లి భాస్కరరావు

మాఁవ:- సదువెందుకే లచ్మి-సదువెందుకే-
సంసారముండంగ-సాలదా లచ్మి- ॥సదువెందుకే॥

లచ్మి:- సదువెందుకామాఁవ-సదువెందుకా-
సదువంటు లేకుంటె-పరువు పోతాదోయి- ॥సదువెందుకా॥

మాఁవ:- పగలు రేతిరిలేక-పాటు పడతామే-
బతుకంత బలిచేసి-బాధ పడతామే-
సావడానికి కూడ-సమయమే లేకుంటె-
సదువు వెందుకు మనకు-వదలవే లచ్మి- ॥సదువెందుకే॥

లచ్మి:- పనిచేసి బలిచేసి-పాటు పడతామోయి-
ఫలితమేదో మనము-తెలుసుకోలేమోయి-
పనిలోని పసతోటి-మనకింత సదువుంటె
మునుపు లాగిక మనము-మోసపోమో మాఁవ- ॥సదువెందుకా॥

మాఁవ:- ప్రతియేడు మన వయసు-పెరుగుతున్నాదే-
బతుకనే బాటలో-గతుకులున్నాయే-
ఎదురు తెన్నులులేని-ఏటి కెదురీతలో-
సదువు లసలేమనకు-సాగవే లచ్మి- ॥సదువెందుకే॥

లచ్మి:- మనసంటు నీకుంటె-మార్గమున్నాదోయి-
మన కోసమే సదువు-మాపులున్నాదోయి-
మాపిటికి బడిలోన-దీప మెడతారోయి-
మనమందరము జేరి-మంచిగా మారాలి- ॥సదువెందుకా॥

మా౹వ:- సిన్న నాటనె సదువు-సున్న చుట్టించామె-
ఇన్ని యేళ్లూ మనము-మిన్నకున్నామే-
పరువుకోసం నేడు-బడిలోకి పోబోతె-
పరులు చూశారంటె-పక్కుమంటారే- ॥సదువెందుకే॥

లచ్మి:- ముదుసలయినా కూడ-సదువుకోవాలోయ్-
అదను మించినదంటు-అలమటించాలోయ్-
విద్దెకోసం మనం-వేగిరించాలోయ్-
ఇద్దరం బుద్దిగా-విద్దె నేర్వాలోయ్-
సదువెందుకామా౹వ-సదువెందుకా-
సదువందుకే మనం-బతికేందుకే-

మా౹వ:- సదువందుకా-మనం బతికేందుకా-
పరువు నిలిచేందుకా-కరువు తీరేందుకా! —

# 'రెండు కులములు'

—సి. నారాయణరెడ్డి

స్వార్థ పూజలకై కులమ్ములు
సాధనములైనవి ఇటీవల.
చెట్టు పేరున కాయలమ్ముట
సిగ్గు చేటగునట్టి కార్యము.

కులము పేరున తెలివితేటల
విలువ కట్టుట వెర్రి తనమగు.
పంచములలో నాడు నేడును
బ్రహ్మవేత్తల చూడ బోమా?

కవుల గూడ కులాల వారిగ
గణన సేయుట బుద్ధి మాంద్యము.
వెన్నెలలదే కులమొ తెల్పిన
వెన్క కవులది తేల్పవచ్చును.

తొల్లి నాళుల లక్ష్యసిద్ధికి
దూరమైనది వర్ణ పద్ధతి
పసి తనమ్మునగల పవిత్రత
పండు వయసున నుండునామరి?

మన 'మహాకవి' చెప్పినట్లుగ
'మంచి చెడ్డలు రెండె కులములు.'
రెంటి లోపల మంచినే గు
ర్తించు వారే అగ్రవరులు.

# భావే చక్కట్లు

## (కదంబము)

—తుమ్మల సీతారామమూర్తి

సైఁపఁజాల నేఁటిసంఘవ్యవస్థ; నీ
యవని రామరాజ్య మమరవలయు
నపుడు రాజు రాముఁ, డఖిలప్రజాళియు
రాముఁ, డుర్వియెల్ల రామమయమె

దొంగతనమువంటి దోసమహో! సిరిన్
గూడఁబెట్టి దాఁచుకొనుటసైత;
మిది యకృత్య మనుచు నిపుడు గాకున్న రే
పైన లోక మొప్పు నని తలంతు

అడుగు మని నన్నుఁ బ్రేరేచినట్టివేల్పె
యిమ్మనుచు నన్నుఁ బురికొల్ప కేలమాను?
బిడ్డ కాఁకలిపెట్టిన దొడ్డదేవుఁ
డమ్మ యొమ్మున నూరింపఁడా పయస్సు?

ఈపేదలు మనవేల్పులు,
పాపము! వీ రెండి తడిసి పస్తుండి జగం
బాపోవఁ గూడుపెట్టెద;
రోపికలో వీరి కుద్ది యుండర యెవరున్

పిల్లలు రక్షించెద రని
తల్లి నిరీక్షించు నవ్విధమ్మున మీపై
నుల్లము నిడుకొని కాలము
చెల్లింతురు వీరు జాగుసేయకుఁడు దొరల్!

తడసిన మీదోసము వే
మడుఁగు లగున్ విలయవహ్ని మార్కొను మిమ్మున్
నడిచి నడిచి వచ్చితి మీ
యెడఁదన్ నిదరించునీశు హెచ్చరికింపన్

బాపు లేమి నిపుడు బయటికి వచ్చితీ
నేతఁ గాను మీకు నేను భటుఁడ
మ్రొక్కుచుంటి భక్తిముగ్ధుఁడనై గుణ
భద్రులార! మత్సపర్య గొనుఁడు

నిదురఁ గలి నుండు, సెజ్జను వదలి కూరు
చున్నచో ద్వాపరమ్మున నుండు నరుఁడు
నిలిచెనా త్రేత నుండు నజ్జలు కదల్చి
త్రోవఁ జనువేళ నతఁ డుండుఁ దొలియుగాన

ప్రేమఁ బెరుఁగుఁ దెలివి పెరుఁగు నాయుష్యమ్ము
పెరుఁగుఁ బాదయాత్ర జరుపువేళ
నడువ కుండువాఁడు నలువదియేండ్లకే
తాత యౌను లేక ప్రేత యౌను

పదయాత్ర, శంకరాదుల
మది మెచ్చినయాత్ర, జనులమనముల కింపున్
గదియించుయాత్ర; దీనిని
వదలన్ భావప్రచారవరసాధనమున్

పనాఁ డపరిగ్రహమును
మానెన్ బాపఁడు, తదీయమహిమము సర్వం
బానాఁడె సమసెఁ, బ్రాజ్ఞుఁడు
కానీ కెగఁబడినవాఁడు కలఁచున్ బ్రజలన్

సుదతులు, శూద్రులు వేదము
చదువం జన దనెడిపల్కు సైఁపను; నాకున్
జదు రున్నది శ్రుతివిద్యన్;
మది యున్నది దీని నేర్పి మనుజులఁ దీర్పన్

దేవుఁడు కలఁడని నమ్మక
పోవచ్చు నొకండు; వాఁడు భూతహితమ్మున్
భావించిన, సత్యముతో
జీవించిన జాలుఁ బెద్దచేసెద నతనిన్

నరున కున్నచేవ పరిమిత మౌటచే
నతని సేవ సైత మవధి నుండు
సేవ కెల్ల యుంట చెల్లును గాని, భా
వనకు మేర యుంట పనికిరాదు

ప్రజ కెల్ల సేవచేయుట
నిజమునకు నసాధ్య; మైన నిఖిల ప్రజయున్
స్వజనంబ యని తలంచుచుఁ
ద్యజింపవలె నరుఁడు కులమతాదివివక్షన్

దేహమను గాను నేను సందీప్త మైన
యాత్మనని నమ్మవలయు, దేహమ్ముపట్ల
నాదరము పుట్టెనా వైర మవతరించు
ముక్కలై చెక్కలై యాత్మ ముప్పుదెచ్చు

మనకుఁ జేటుగూర్తురు ముసల్మాను లనుచు
హిందువులు జంకెదరు; గాని హిందువులకు
దొసఁగు దెచ్చెడువారు హిందువులు గాక
యన్యులుండరు నమ్ముఁడా యస్మదుక్తి

కులమత భేదమ్ములపై
వల పుంచిన, నంటరానివాఁ డని యొకనిన్
వెలిపెట్టిన మనమే మన
విలయము సృష్టింతు; మొరుల వెంపర యేలా?

వెలుపటి దెస మనశత్రులు
కలరా? మన యెడఁదయందె కల రుద్ధతులై;
యిల మనకున్ నెచ్చెలి కా
వలయు ననన్ జెలిమిఁ జూపవలె మన మిలకున్

ప్రేమశుకము కలదు మీమదిలో; దీనిఁ
బఋపకుఁడు కుటుంబపంజరమున
నిచ్చవచ్చినట్టు లిది ఱెక్క లాడింప
నిచట నచట నెగుర నియ్యకొనుఁడు

ఏ నింతవనుక నొకఖలు
నేని విలోకించి యెఱుఁగ; నిది విని లోక
జ్ఞానం బబ్బని మూర్ఖుని
గా నను మీ రెంతురేని గా దన నొల్లన్

నాశ్రమోల నెవఁడు నిల్చిన
నామానవునందు వేల్పె యగపడు నాకున్
సామాన్యధర్మమై చన
నామనుజున కంజలించు నస్మత్కరముల్

మన కహింస నియతమార్గ; మీబాటను
విడువ కుందుమేని పుడమినెల్ల
నెత్తఁగలము మన మహింసాపతాక; లీ
మడువు లెడఁదఁ జీల్చి విడుచుచుంటి

ఏ నలంతివాఁడ; నైన నీశుఁడు బుద్ధ
దేవుపనికి నన్నుఁదెచ్చి నిలిపె
శాక్యముని పవిత్రచరణాంకముల నాశ్ర
యించి విధిని నిర్వహించువాడ

జలకణమ్ము వార్ధిఁ గలసి పయోధియై
యలరుచందమున నహంత విడిచి
నరుఁడు తన్నుఁ దాను మఱచి విశ్వాకారుఁ
డైన వేల్పునందు నణఁగి వెలయు

చట్టములు-కావు ఋషులే
పుట్టింతురు విప్లవమ్ము; బుద్ధుఁడు ప్రభుతా
పట్టమును రోసి కావిం
గట్టిగదా క్రాంతి దెచ్చెఁ గనుఁడీ చరితన్

మనకు సత్యనిరతి మప్పె రాఘవుఁడు, ని
ష్కామ కర్మనిష్ఠ గఱపెఁ గృష్ణుఁ,
డార్త లోక సేవ నలవరించెను బుద్ధుఁ;
డీ త్రయమ్మె మనల సృష్టిచేసె.

# ప్రగతి గీతం

(నాగార్జునసాగర్ నిర్మాతలైన కూలీలకు అంకితం)

—ఉత్పల సత్యనారాయణాచార్య

పలుగు పాఱ గొనిరారా
తెలుగువాడ రారారా
నీ త్రవ్విన త్రవ్వకమది నీ కట్టిన కట్టడమది
నవభారత భాగ్యోన్నత భవితవ్యపు సౌధానికి
మూలబంధమగు పునాది మూడుకోట్ల జనుల ప్రోది
దారిద్ర్యము పోదోలగ తహతహపడుచుండినయది.
పలుగులతో పాఱలతో చెలగి త్రవ్వబడునట్టివి
గోతులు కా వయ్యావి మన జాతికి నిక్షేపమ్ములు
త్రవ్వి తలకు నెత్తినట్టి తట్టలలో నున్నట్టిది
వట్టి మట్టికాదయ్యది వన్నెలీను బంగారము !
అంచెల మీదిటికరాళ్ళ నందుకొంచునున్నప్పుడె
చకచకగా కట్టడముల సాగించుచునున్నప్పుడె
నలువైపుల కాలువలను నెలకొల్పుచునున్నప్పుడె
కోడెల నలవార్చి రైతు కాడిగట్టుచున్నప్పుడె
జలజలమని పాఱివచ్చి పొలమంతయు కలయబర్వి
పదునుచేసి అదనులోన బంగారము పండింపగ
నాగార్జునసాగరమ్ము వేగిరపడుచుండినయది
దారిద్ర్యము పోదోలగ తహతహపడుచుండినయది.
రొంపేటిక ముంపబోదు రూకల సంపాదించును
తుంగభద్ర దిగువకాల్వ బంగారము పండించును

అద్దంకిని మంచినీటి ఎద్దడి మటుమాయమగును
గుండ్లకమ్మ కమ్మని జలకుంభమ్ములు పట్టినిలుచు
సింగరేణి జవశక్తులు సీలేరున జలశక్తులు
మాచిఖండ రామగుండ మండల విద్యుచ్ఛక్తులు
చీకట్లను పాఱదోలి జీవకాంతి నొసగుటకై
కార్మికజనగృహపంక్తుల కలకలలాడించుటకై
వేగిరపడుచుండినయవి సాగివచ్చుచుండినయవి !
ఒక యింటికి ఒక పథకం బొకగ్రామం బొక రాజ్యము
దీపించిన నవభారతదేశమొక్క సామ్రాజ్యము
ఇరుగుపొరుగు దేశీయుల పరిచయమ్ము పొందుటకై
కలసిమెలసి నవజీవనకలితపదము నొందుటకై
విశ్వశాంతి జయపతాక వినువీధికి నెత్తుటకై
నవభారత యువలోకము నడుముకట్టి నిల్చినయది.
నాడొక్కతె ఝాన్సిలక్ష్మి నానాసాహెబు ఒక్కడె
నేడుచూడు ఇంటింటను నిలిచినారు యువయోధులు
నిజదేశ స్వాతంత్ర్యము నిలుపుకొనగ మా బిడ్డలు
నవభారత జాతీయత చవిచూచిన యువయోధులు !

---

# పంచాబ్దపు ప్రణాళికలు

—కల్లూరి భోగేశ్వర సోమయాజులు

1

పంచాబ్దపు ప్రణాళికల
పరమార్థం తెలుసుకోర
భారతీయుడా!
గగనానికి ఎగసిపడే
నదులన్నీ సాధువులై
నడచివచ్చు నీవెనకనె,
కదలివచ్చు నీ తోడనె
కఱవులింక కలుగవుగా
పరువులింక పెరుగునుగా. ॥పంచా॥

2

పల్లెలలో పిల్లలింక
పసుల కాచుకొనుట మాని
పాఠాలను వల్లెవేయు
భాగ్యాలిక కలుగునుగా
ఎడంచేతి వేలిముద్ర
ఎందుక కనుపించదుగా. ॥పంచా॥

3

ఊరేలే వాడొకడు,
కూలడిగేవాడొకడు,
కష్టించే వాడొకడు,
కరుణించే వాడొకడు,
అంతస్థుల భేదాలిక
అంతరించి పోవునుగా. ॥పంచా॥

4

ఉన్నదంత ఖర్చుచేసి
విద్యలెన్ని చదివినా,
ఉద్యోగం లేదంచును
వాపోయే జీవులింక

మందుకైన కనుపించని
మంచిరోజు లొచ్చెనుగా ॥పంచా॥

5

యువకులింక సోమరులై
అరుగు లరుగునట్లుగా
పేకాటల నాడుకొంచు
డంబాలను పలుకుకొంచు

పాడైపోయెడి రోజులు
పోయెనుగా ! పోయెనుగా పోయెనుగా! ! ॥పంచా॥

---

1. ప్రాజెక్టులు కట్టబడును. 2. ఊరూరా విద్యాలయములు నెల కొలువ బడును. 3. వ్యక్తులలో నున్న పరస్పర తారతమ్యములు తగ్గింప బడును. 4. నిరుద్యోగ సమస్య తీరగలదు. 5. యువకులలో సోమరి తనము పనికి రాదు. నడుము వంచి పనిచేయవలెను (అని భావము.)

# ప్రబోధము

—పాలా వేంకట సుబ్బయ్యా

అదిగో సాగుచు నున్న దివ్యసుధ స

ర్వాయత్త సంరంభ సం

పదతో నభ్యుదయోద్యమంబొకటి, ని

ర్వాకంబు సేయంగ నీ

కిదియే సత్సమయంబు, తోడ్పడుము సా

ధింపంగ సౌభాగ్య మిం

కెదియున్ లేదు పథంబు వేరొకటి? మే

ల్కొనవేల మౌనంబునున్?

దేశమే నీయది తికమక పడుదేల?

ముందడుగు వేయక-పూనిపనికి,

ఆర్య ధర్మమే నీది-యవని సుఖము గోరి

నడుము కట్టవ దేల?- మడుగు విప్పి,

అభ్యుద యోద్యమ- మను ప్రణాళిక నీదె

కష్టించ వదియేల ? - కాలు కదిపి,

త్యాగమే నీ సొత్తు - ధనమొసంగ వదేల ?

దేశాభ్యుదయ కాంక్ష - దీక్షబూని.

పంచవర్ష ప్రణాళిక - పరుల దనుచు

భావనము సేయ నగునేని - భారతీయ,

వరల నిత్య కల్యాణము - పచ్చతోర

ణముగ భరత వర్షమికఁ బూ - నంగ వలదె.

విరియ నవజ్ఞతా సుమము
 విశ్వము నిండు తమిస్ర గ్రంథముల్,
తొరఁగును భావి సౌఖ్యములు,
 దుష్క్రియ లాశల బ్రాకు నెంతయున్,
గరుణను జూసి యా యినుప
 గజ్జెల తల్లి ఘటించు నాట్యమున్,
సిరులెటు గల్గు జ్ఞానమున
 చిత్తముఁ బూన్పుమి కార్య భూమికన్.

విజ్ఞాన మున్న నే - విశ్రుత కృషియందు
 సంలగ్న చిత్తంబు - జాలువారు,
శక్తి సామర్థ్యాలు - సమకూడినప్పుడే
 కార్యసా ఫల్యంబు - కంట బడును,
పట్టుదల వరల - భల్లూకము విధంబు
 జయము సాధింపఁగా శక్తి గలుగు,
సమధి కోత్సాహంబు - స్వాంతమందున్న నే
 ధైర్యంబు కార్యాల - తాండవించు,

నాల్గు ప్రతి పాదనములు నం - దమగు నాల్గు
స్తంభములగు ప్రణాళికా సౌధమునకు,
కూర్చుకొనుమోయి సోదర - గొణుగు టేల ?
స్వాభిమానంబు గలదేని - సమయ మిదియ.

ప్రాజెక్టులను గట్టి - పఱ నేలలఁ దడ్పి
 శాద్వలంబుల సేయు - శాఖ యొకటి,
ఫ్యాక్టరీలను బెట్టి - యమల రసాయని
 కపుటెరువు లందిచ్చు - కాండ మొకటి,
విద్యు దుత్పాదన - విరివిగా నొనరించు
 పారిశ్రమలఁ బెంచు - భాగ మొకటి,
ఉక్కు కర్మాగార - మక్కఱ దీర్పంగ
 స్థాపించునట్టివి - థాన మొకటి.

గల ప్రణాళికోద్యమ మను - కల్ప తరువు
ఏచి యెసలారి ఫలియింప - వేచియుండె,
ప్రోది సేయుమ సోదర ! పోలునట్టి
సర్వ సహాకార మొసఁగి ప్రా - శస్త్యగతిని,

అదనొదవంగఁ గార్యముల
నాదర మున్నటు చూపి, మీఁదటన్
చెదలు విధంబు లాభమును
చేతికిఁ జిక్క- చరించి, లుబ్ధులై
సదమల రూపు కార్యముల
సంధిల సేయక ద్రోహులౌదు, రా
మొదటి సమాజ శత్రువుల
బుద్ధి మరల్పఁగబూను సోదరా !

హక్కు-లడుగంగఁ జాలిన - యార్యుఁడేల
బాధ్యతల నెదరోయడో - పాలు పోదు
స్వార్థబుద్ధికి విస్మృతి - సహజమేమొ
హెచ్చరిక సేయఁబోలదె - యింకనైన,

శరదమల విష్ణు పథమున - సంచరించు
కారుమబ్బులు చెదరఁగా - కళలనించి
వెలసె రాకాశశాంకుఁడు - విరియు కలువ
సిరులు మెండుగా నింకేల - చింత గొనఁగ?

మన పన్నులను గూర్చి - మన ద్రవ్యమును జేర్చి
మన ప్రణాళిక నెగ్గ - మనము ముందుకు మొగ్గ
అడ్డుబెట్టే దెవడురా - మనలను
అడుగు ముందుకు వేయరా !

పొలములో పైరులు - నిలువెత్తుగా పెర్గి
గాదెలు నింపంగ - కలకలా మన రైతు
పరిశ్రమలు వెల్గి - పని గల్గ కూలీలు
పకపకా నవ్వుచు - పండుగల్ సేతురు,

మన లక్ష్య మిదియేనురా - మనమిఁక
పనిసేయ పూనాలిరా॥

# ప్రణాళికా గీతం

—చెఱుకుమిల్లి భాస్కరరావు

పల్లవి: లేరా, భారత వీరా, వేడుక మీరా, తెలియర ఇది యేమో,
అందరికి ఆనందము నిచ్చే సుందర స్వప్నము అగునేమో

అనుపల్లవి: ఇదియే భారత రాజ్యాంగమునకు రచియించిన ఒక యోజనగా
ఇగి అయిదేండ్లకు ఆనందముతో అమరించిన ఒక సాధనగా

చరణము: 1.

పంటలు పండని బంజరు భూముల
బంగరు చేలుగ చేయుగదా!
కంటకయుతమగు కంకరబాటను
కన్నుల పండువ చేయుగదా!
ఆకలి దప్పుల తీర్చుట కొరకై
ఆహారములు కృషి చేయుగదా!
అన్నము వస్త్రము అందఱి కొసగుట
ఆశయముగ తల పోయుగదా!

॥ఇదియే॥ ॥లేరా॥

చరణము: 2.

రహదారుల నిర్మాణము కాగా
రైలు మార్గములు రాగా,
బహు ముఖముల మన దేశ వర్తకము
పలు దేశములకు పోగా,
గ్రామ సీమలకు నూతన తేజము
రామణీయకత రాగా,
ప్రేముడితో మనదేశ నాయకులు
ప్రాభవమును కొనితేగా॥

॥ఇదియే॥ లేరా॥

చరణము: 3.

దక్షిణమున నాగార్జున సాగరు
సాగరముగ కనిపించు గదా!
లక్షల కొలదిగ చేలను తడుపుచు
రక్షణమును కలిపించు గదా!
విద్యుచ్ఛక్తిని విడుదల చేయుచు
విస్తృత సుఖ మొనరించు గదా!
విశ్వ ఖ్యాతిని సముపార్జించుచు
విస్మయ వరమలరించు గదా!

॥ఇదియే॥ తేరా॥

# 'ప్రగతి పథం ....'

—'రామకృష్ణ భరద్వాజ'

భరత ఖండ పౌరులార!
తరుణ సుహృద్ధర్ములార!
కల కాలము కలిమి నిండు
విలువ పలుకు వినగ రండు...

దేశ గతుల దివ్యస్థితి
ఆశ తీర్చు అభ్యున్నతి
అవతరించి హాయినిచ్చు
అవకాశము నాదరింప
వేగరండు - ప్రేమతోడ
స్వాగతింప వచ్చినిలుడు
అధమమౌ నిరాశ వీడి
అధిక సుఖ ప్రాప్తిఁగొనుడు ॥భర॥

అభ్యుదయ పునాదిరాయి
సభ్యత కిల సత్యదాయి.
కలుగుచోటు కని తరింప,
వెలుగు బాట వెలువరింప
మన దేశపు మహోన్నతుల
ఘన స్థితులు కలుగు గతుల
సరణి తెలియు సచివ వరులు
వెరపు ప్రణాళికల నెరుగ ॥భర॥

అన్ని సమస్యలను శాపి,
పెన్నిధులను పెంచి - లోప
రహితత్వము - రమపుష్టి
మహినించెడు మహాదృష్టి
ననుభవజ్ఞులైన ఘనులు
జన క్షేమ జ్ఞాన ధనులు
పంచవర్ష ప్రణాళికల
నెంచి మంత్రు లేర్పరచిరి. ॥భర॥

అందున్నవి ఆస్థ పెంచి
అందమందు అవధిమించు
సాధనాలు - సమర్పణల
ఆధునిక ప్రణాళికలు
వరుసగ ఈ ప్రముఖ లక్ష్య
పరమంబౌ ప్రాప్తి కూర్చి
ఏఏటా ఇతోధికపు
దీటు వృద్ధి తెచ్చి చూపు - ॥భర॥

అరవై ఒకటిలోనికను
ఇరు ప్రణాళికలు తుదకు
పూర్తియౌను - మూడవదగు
కీర్తిమంత కృషుల పొసగి -
ఆహార సమస్య తీర్ప
సహకార వ్యవసాయ మొప్పు -
నేటి కుటుంబ నియంత్రణము
కలవు శాపు కరకుటమ్ము ॥భర॥

నిరుద్యోగ నివారణకు
దరిద్రతలు తలగు కొఱకు
పరిశ్రమలె పరమ పథము
సిరి సంపద చేరు విధము

నిలుపబడ్డ నీటి పాఱు
దలల వల్ల తనివి మీఱు
ఫలసాయము - పరిశ్రమలు
జల విద్యుచ్ఛక్తి వఱలు - ॥భర॥

ఆరోగ్యమె అనవరతము
సారమ్మౌ సరళ పథము
అందులకై ఆసుపత్రు
లందు వ్యాప్తి నతి మాత్రం -
మెలగుటకై మేత్తరముగ
అలవడవలె నవార్యముగ
నియమిత సైనిక శిక్షణ -
అయి తీరును అది రక్షణ ॥భర॥

ముడి సరకుల - పొదుపు పనుల
కడలు కొన్న ఘన క్రమల
సార్థక్యము సాధించుచు
వర్ధిల్లగ వలయు జనులు.
రహదారుల రమ్యవృద్ధి,
సహకారపు సంఘ సిద్ధి,
గ్రామాల వికాస లబ్ధి
అమితమ్ముగనందవలయు. ॥భర॥

పని వెలసిన జాతీయ వి
కాస సంస్థ - గణుతిని వి
ద్యా సౌకర్యములు ప్రజల
ఆసక్తుల నధిగమించు.
దేశమునకు ద్విగుణీకృత
ప్రాశస్త్యము పరమోన్నతి
ఐశ్వర్యము - అభ్యుదయ వి
నశ్వరతయు - న్యాయమొప్పు ॥భర॥

ప్రభుత్వమ్ము పలువిధాల
అభినివేశ మాదరాల
ప్రయత్నించి ప్రజాళికల
జయ సిద్ధిని సాధించును.
మనము కూడ మహిత శక్తి
పునీతమౌ ప్రభుత్వ యుక్తి
కీయ వలయు నింపు మిగులు
చేయూతల శీఘ్ర గతుల ॥౪౨॥

---

# సహాయం....

—విద్వాన్ వెంకటయ్యా.

క్రమముగా-పంచవర్ష ప్రణాళికలకు
బటువైన చక్కని పట్టు గొమ్మ,
లాదర్శ గ్రామ భాగ్యా నందములకు ని
త్యము వికాసము గూర్చు నాట పట్టు,
లధికార వర్గ గ్రామ నధికార వ
ర్గాల కైక్యము గూర్చు రాయ బారు,
లభివృద్ధి కార్య క్రమాళి నందించి సే
వింపంగ బోడమిన వేగు చుక్క,

అన్ని విధముల మనకు తోడై ప్రభుత్వ
గౌరవంబును నిలబెట్టు వార లీరు
సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు
మేలుకోరు వారు డెవలప్ మెంటు వారు

* * * * *

పరి గడుపున నుండి పసుల కాపరులయ్యు
కన్న వారికి గూర్చు పిన్నలార!
పగలెల్ల కుల వృత్తి పాటించి తండ్రికి
ఉత్సాహ మొనగూర్చు యువకులార!
బాధ్యతల్ పైబడి బాధింప క్షణము వి
శ్రాంతి నెఱుగని సంసారులార?
వంట వార్పులనియు నింటి పనులు మున్గి
వాకిళ్లు దాటని వనితలార!

అక్షర జ్ఞానమును పొంద నాదరమున
రాత్రి బడులకు తప్పక రండి! రండి!
సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు
మేలు కోరువారు డెవలప్ మెంటు వారు.

చదువ వ్రాయను నేర్పి సంస్కారి నొనరింప
నయ్యవారి నౌకరి నంపినారు
మబ్బును పోద్రోలి మఱిమఱి వెలుగుల
నిచ్చు దీపంబుల నిచ్చినారు
వ్రాసి దిద్దను దిద్ది వ్రాయంగ ననువైన
మంచి పలకలు పంపించినారు
అక్కరములు మొద లంత విజ్ఞానమ్ము
నొసగెడి పొత్తమ్ము లొసగినారు

పత్రికలు వచ్చు పీళ్లు నేర్పఱచినారు
పైన తనఖీలు పెట్టిరీ బడుల కెల్ల
సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు
మేలు కోరువారు డెవలప్ మెంటు వారు...

ఏన్నురూకల రసీ దున్నదున్నట్టుల
తెలిసికో గలిగెను తిమ్మిరెడ్డి
ఎదురు పట్టీలలో నన్ని తాన్లున్నవో
చదువుకో గలిగెను శంకరయ్య
పంచాయతీ బోర్డు మంచి చెడ్డలు కొన్ని
యోచింప గలిగెను ఓబులన్న
తమవారిలో కొఱంతలు తీర్చు విధమేదొ
సూచింప గలిగెను సుబ్బలక్ష్మి

ఊరి వసతులు తీర్పగా యువజనమ్ము
పాటుపడ గల్గె నీరాత్రి బడుల వలన
సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు
మేలు కోరువారు డెవలప్ మెంటు వారు...

* * * * *

ఏ హాని చేయక దేహ బలమ్మున

మేలొనర్చెడి బ్యాటు మెంటు నాట

కరచరణమ్ముల కిరవంద బలమిచ్చి

వన్నె నొసంగెడి వాలిబాలు

కాలి తన్నులతో చకాచక పరువెత్తి

పో బల మిచ్చెడి పుట్టు బాలు

చిన్నలు పెద్దలు చేరి సంబరమున

రివ్వున విసరెడి రింగు బాలు

పలు రకమ్ముల బంతులు, వలలు, బ్యాట్లు

ఇచ్చి వ్యాయామమునకు చేయిచ్చు వారు

సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు

మేలు కోరువారు డెవలప్ మెంటు వారు...

* * * * *

నీతి దయా సత్య నిర్మల గుణముల

కాట పట్టులు మన నాటకములు

వీరకరుణరసావేశ హాస్యములకు

పుట్టి నిండ్లగు మన బుఱ్ఱ కథలు

భక్తి వేదాంత విరక్తి కీర్తనలకు

నిజ గేహములు మన భజన జట్లు

నవరసోచిత సాభినయ భంగిమములకు

నవ జీవములు మన నర్తనములు

వృద్ధి సేయగ, కొత్తవి వెలయ సేయ

ప్రొద్దు ప్రొద్దున మనలను ప్రోత్సహించు

సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు

మేలు కోరువారు డెవలప్ మెంటు వారు...

* * * * *

ఆయురారోగ్యమ్ము లభివృద్ధి నందింప
నాను పత్రులు మన కవసరమ్ము
సాయం సమావేశ సంతసమ్మును గూర్చు
క్లబ్బులు మనకు నక్కఱయె సుమ్ము
అక్షరారంభ విద్యా ప్రదానమునకు
బడులును మనకు కావలయు గాదె
వివిధ వార్తాశేష విజ్ఞానదమునకు
పఠన మందిరములు మనకు వలయు

కాన మన బాగు నెంచుచు కన్ను గలిగి
సంఘ శక్తితో ముందుకు సాగిరండు!
సగము కర్చుతో సాయమ్ము సలుపు వారు
మేలు కోరువారు డెవలప్‌మెంటు వారు.

———

# విన్నపం

—"మురారి"

చేయి చేయి కలుప
వేయి పనులు స్వల్పం
ఒక్కొక్కరు చేయ
ఒక్క పనే భారం
గడ్డి పోచ పట్ట లేదు
గండు చీమ నొక్కదాని
పదులు తృణము లేకమైన
పట్టు మదపు ఏనుగునే
పదిమందీ ఏకమైన
పాషాణం మెత్తబడును
చేయి చేయి కలుపు
సహకారం నెరపు

*　　*　　*

రాయి రాయి కలియ రాజిల్లు సౌధమ్ము
నీటి బొట్లు చాల—నీరధులగు
చేయి చేయి కలుప చెన్నొందు పథకాలు
కలిసి చేతలోని ఘనత చూడు.

ప్రణాళికలో వున్నది
ప్రగతి పథం అన్నది
నీకు, నాకు, అందరికీ
మన పిల్లల ముందడుగు

ప్రతి రోజొక పండుగగా
పరమానందము కురియ
ప్రణాళికా విజయమ్మును
కాంక్షించుము కృషి చేయుము.

ప్రగతి వచ్చు మనము ప్లానుకు తోడ్పడ
ప్రగతిలోనె మనకు బ్రతుకు మంచి
ప్రగతి లేని బ్రతుకు ప్రాముఖ్య హీనమ్ము
ప్రగతి సుగతి కాద పరమ హితుడ !

*　　*　　*

అదుపుచేసి వ్యయమును
పథకమ్ములకిమ్ము సొమ్ము
ప్రభుతకు చేయూత నిమ్ము
నీ—నా—జీవన పరిమాణమ్ము
త్వరితమ్ముగ పెరుగనిమ్ము
మన పిల్లల "రేపు" లు
దిద్దుకోనిమ్ము రూపులు

రూపు దిద్దు కొనును రేపటి బ్రతుకులు
పొదుపు "ప్లాను" కొరకు మదుపు పెట్టి
స్వార్థ హీనమైన త్యాగమ్ము చేయగా
'ప్లాను' జయము కొరకు పాటు పడుము.

# సమాజ వికాసము

—తుమ్మల సీతారామమూర్తి

బాపుజీ దుర్భరతపమ్ము పండి పండి
ప్రజల యతిమానుష త్యాగబలము హెచ్చి
భారతక్షోణి వేయేండ్ల బరువు ద్రోసి
క్రొత్త వెల్గులతోఁ దలయెత్తి నిలిచె

పరతంత్రత చనినంతనె
పరిపూర్ణం బగునె దేశభాగ్యమ్ము? పోరిం
బోరి నిల్లలికిన యంతనె
జరుగునె పండువు రసప్రశస్తాన్నములన్?

దారిద్ర్యం బజ్ఞానము
రారమ్మని పిలుచు మనధరన్ నలుగడలన్,
ఈ రెండు దయ్యములతోఁ
బోరాడఁగవలయు నేఁడు పురుషులు సతులున్

వాఁగులను వంకలను గట్టి సాగు పెంచి
మిట్టపల్లాలు సవరించి గట్టు వైచి
బస్సునకు బండి కనువైన బాట దిద్ది
యూరు పాలెము సౌఖ్యమ్ము నొందవలయు

కోహినూరును గన్న తెల్గుంబొలాన
ఖనిజ సంపద కేలోటు గానరాదు
నదులు నర్తించు మన భూమి కెదురులేని
వైద్యుతబలమ్ము కల్గు టబ్రంబు గాదు

సంపదల కేమి మన కవి
గుంపులుగాఁ గలవు కాని గుటకలు వేయన్
బెం పొదవదు చెమ టోడ్చుట
యింపిత మైనపుడె జాతి కేర్పడు లగ్గుల్

శ్రమ పడుచే జాతికిసిరి
శ్రమపడుచే రాజ్యమునకు సంపద యెచటన్
శ్రమ కన్పడు నచ్చటనే
రమ కన్పడు నఖిలసుఖ పరంపర లిడఁగన్

పదవికంటె మేడలకంటెఁ బసిఁడికంటె
మానవీయమ్ము పని యన్నమాట నెంచి
దేశసౌభాగ్యమునకుఁ బందెములు గట్టి
బడలవలయుఁ బ్రజల్ రేయి పవలు మఱచి

ఇది కావలె నది కావలెఁ
బదివే లిమ్మనుచు వేఁడుపని మానవలెన్
ఇది చేసితి మది చేసితి
మెది బహుమతి? యంచుఁ బ్రభుత నెసకొల్పవలెన్

రాచఱికము వారికడన్
దాఁచిననిధు లేమి కలవు? తలబరువైనన్
వైచెదరు వారు పన్నుల
సైచెదరా? ప్రజలు పేద సంసారములన్

ప్రామవలె నీరసమ్ముల;
గ్రామం బొకకుదురుగాఁ బ్రకాశింపవలెన్;
ప్రేమ గలచోటు హర్షా
రామం బగు నన్న తెలివి రావలెఁ బ్రజకున్

పంచాయతి సభ్యతకై
కంచము మంచమ్ము నమ్మఁగా వలయునె? రెం
డంచుల కత్తులు వలయునె?
కొంచెపు బ్రదుకునకు నియ్యకొనఁగావలెనే?

ఇరుగువాని మేలుకొఱకు నలంగెడి
యన్న కొఁసగు డున్నతాసనములు
పొరుగువానిఁ జెఱచి పొగరెక్కి నిక్కెడి
దున్న కేల పూల తోరణములు

అంగబలము కతన నర్థబలమ్ముచే
నెత్తనాలు వచ్చు టుత్త మాట
వచ్చుఁగాక వాని వైభవ మెన్నాళ్లు?
మఖను బుట్టి పుబ్బ మణఁగిపోవు

అవివేకమునకు స్వార్థ
ప్రవణతకున్ బాదులైన పల్లెలు జగతీ
భవితవ్యము నణఁచు గదా!
సవరింపఁగవలయు వీనిజడతన్ నడతన్

ప్రతినసేయవలయుఁ బ్రజలు భారతి లేని
పట్టునందు గంగ ముట్ట మనుచు
హరిని హరుని జేరి యర్చించుటకు ముందె
సలుపవలయు గ్రంథ నిలయపూజ

పత్రికలు చదువవలె నీ
ధాత్రిం గల రాజకీయతత్త్వము తెలియఁగన్
జిత్రమ్ముల సొగసుల నవ
విత్ర కథలఁ దనియువలపు వీడఁగవలయున్

కమ్మని బాస బలా! మన
సొమ్మైనది రక్తి భక్తి జోడించి తదీ
యమ్మగు నైపుణి వడయుఁడు
సమ్మానము లందుకొనుఁడు సభలన్ దెనుగుల్!

నేర్చినది నన్నయాదులు
తీర్చిన మార్గమ్మునకు విధేయం బగుతన్
కూర్చినది విశ్వమానవ
వర్చో జనయిత్రియై ధ్రువత్వము గనుతన్

మంజుల సారస్వతమున
కంజలిగావింపవలయు "నాంధ్రులు విద్వ
త్కుంజరములు కవితాళుకి
పంజరము" లటంచు నొరులు భావింపవలెన్

పల్లె కొక పాఠశాలయు
నెల్లరకున్ జదువుపట్ల నిచ్చయు వలయున్
చెల్లవిఁక వ్రేలిముద్రలు
కల్ల నిజం బెఱుఁగలేని కసటుంబ్రదుకుల్

కత్తివంటియోటు కలదు నేఁ డెల్లర
కది సమాజవృద్ధి కొదవ వలయు
గ్రుడ్డివానిచేతి గడ్డగా నది ప్రయో
గింపరాదు కీడు నింపరాదు

అది పేదలకున్ బెన్నిధి
యది జాతీయతకుఁ జిహ్న మది బాపూజీ
కదలించిన ప్రావెల్లది
'కద' రది సోఁకని ప్రజల్ వికాస విదూరుల్

మగ్గములు రాట్నములు మన మందిరముల
నాడవలయుఁ దియ్యని పాట పాడవలయు
జేతిపను లింటనింట భాసిల్లునపుడె
కలిమి తానై వరించి సాక్షాత్కరించు

మన కుటీర పరిశ్రమల్ మనుచుకొన్న
నుండునా ? దేశమున నిరుద్యోగ బాధ
పట్టములఁ జంక నిడుకొని పొట్టకొఱకు
మూఁల్గు దురవస్థ నెన్నాళ్లు మోయఁగలము!

యంత్రములు వచ్చి మనశక్తి నాహరించె
నింజనులు వచ్చి మనచేవ గుంజుకొనియెఁ
గలిమి పోవచ్చు రావచ్చుఁ గాని మేని
బలిమి పోయిన వచ్చునా ? బ్రహ్మకైన

దంచిన బియ్యము గానుగ
దించిన తైలాదికములఁ దిరుగటి పిండిన్
మంచివి గావని రోసిన
మంచములే మనకు దిక్కు మాపులు జేపుల్

మందులేక చచ్చు మానిసి మన పల్లె
నుండగాదు ప్రాణి యెండరాదు
వాడవాడ కొక్క వైద్యు రప్పించుట
మానరా దుపేక్ష పూనరాదు

ఒకనిగోడ ప్రక్క నొకడు పుల్లెలు వైచి
కులుకరాదు గెలుపు గొంటి ననుచు
వాని వీని కంపు వాడల కెగఁబ్రాకి
వెతలఁ గూర్చు నూరి బ్రతుకు నార్చు

వఱువాత లేచి వీథుల
గరగరగా నూడ్వవలయు గ్రామప్రజ లం
దఱ సుఖమే తన తనసుఖ మను
పరమార్థ మెఱుంగవలయుఁ బ్రతిమానవుడున్

సహకార సంఘముల దెస
కహామహామిక నేగవలయు నార్థిక లాభ
స్పృహఁ జూపవలయు సాహసుల
కహరహమున్ వంగి క్రుంగు టది పోవలయున్

మన పాడికి మన పంటకు
మనుగడ కాధారమై శ్రమంపడు పశువుల్
తిని తిరుగఁ దగిన బీడుల
నొనగూర్పఁగవలయు నూరనూరన్ మేరన్

పంచదరికెల్ల వరి నాటి పాఁడియావు
మేపునకు మైలుఱాలను జూపరాదు
దోమలకుఁ జిక్కి రోగాలఁ దోఁగి తోఁగి
మూల్గరా దకటా! ప్రజ నీల్గరాదు

అడవులను గాల్చి దున్నుట
వెడఁగులపని; గగనచుంబివిటపిచ్ఛటతోఁ
గడుకొని వను లున్నప్పుడే
జడివానలు కురియు నన్న సతములగుచున్

ప్రజల జీవనమ్ము పండింప నిండింప
దొరతనమ్మువారు తొడఁగినారు
మండలములలో సమాజవికాస కేం
ద్రముల నేర్పరింపఁ దరలినారు

ఐదేండ్ల కొక్క మెట్టుగ
నీదేశము నుద్ధరింప నెంచిరి ప్రజలో
నాదారు బ్రదుకు కన్పడ
రాదని చాటించి రెల్ల రాష్ట్రములందున్

నాగార్జునసాగరమున
కేగొడవయు లేని తీర్పు లేర్పడె నడవుల్
మాగాణు లగును ఢిల్లీ
భోగమ్ములు పండు జాతి పొరమిద నికన్

ఒక కృష్ణ యనఁగ నేటికి
సకలాపగ లిఁక నపార సస్యశ్రీ మా
తృక లగు నేర్పడివారి
సుక మేర్పడుదనుక విడువఁజూడరు దీక్షన్

మన సంపద మన సంస్కృతి
మన కీర్తిని పెంపుసేయు మంత్రులు కల రి
ద్దణఁగె నవప్రకృతు లన్నియుఁ
దెనుఁగుం దేజముల నెల్లదెస లొప్పు నిఁకన్

కోట్లకోలఁది సొమ్ము గుప్పుచున్నారు దే
శమ్ముకొఱకుఁ బ్రభుత నల్పువారు
నవ్యభారతమ్మునకుఁ గంకణమ్మును
గట్టినారు జంకు నెట్టినారు

మన విత్తము మన చిత్తము
మన తనువీ యజ్ఞమున సమర్పింపవలెన్
మనరాగము మన త్యాగము
మన భోగము గని జగంబు ప్రమాన్పడవలయున్

లోకమెల్ల మనకు లోఁబడుఁ గాక సం
స్కార మబ్బకున్న ఘనత రాదు
వినయ మార్జవము వివేక మౌదార్య మీ
నాల్గు సంస్కృతికిఁ బునాదిఱాయి

ఏది చేసిన ధర్మము నెదుట నిల్పి
చేయవలె మానవుఁడు వక్రచింత లేక
ధర్మదూరము లైన యర్థములు గాని
కామములు గాని సుగతికిఁ గావు కావు

పెక్కునీతు లేల యొక్కటి చాలు; నా
యొక్కదానిఁ జెప్ప నూరు చాలు
వలచి వచ్చు కైతవడి జిన్నపుచ్చఁగా
నోడి యింతపాట పాడినాఁడ

---

# గ్రామ రాజ్య దీపావళి

—కల్యాణ సింగ్

ఆమె జీవితంలో
రాగం స్పందించింది,
ఆమె త్యాగం చిందించింది.
సృష్టి చేసింది తల్లి.
తన రక్తంలోని సారం తీసి
తన శుక్తంలోని శుక్రం తెచ్చి
తన అస్థుల్లోని మూలుగ కోసి
తన మస్తిష్కంలోని మంతువు త్రచ్చి
పురుషుణ్ణి సృజించింది రామ ;
పుత్రుణ్ణి స్పృశించింది ప్రేమ
అర్భక జీవన పిండం ఆమె తనువున సోలి
ఆమె రుధిరరసం మధురరసంగా గ్రోలి
ఇంత ఐ అంత ఐ, వింతగా మారింది మౌళి.
మీసాలు మొలిచిన మొనగాడు
రోసములో మెలి వేశాడు.
స్త్రీ అంటే అబల అనే సిద్ధాంతం ఒకటి చేశాడు
శ్రీ మత్పురుషుని ప్రక్క యెముకలో
స్త్రీ పుట్టిం దని చెప్పాడు.
స్త్రీని చూచి, ' నేను భర్తను; నువ్వు భార్యవు '
—అన్నాడు.

భరించేవాని వేడి భరింపలేక పోయింది చిగురుబోడి.
'ఈ లోకాన్ని ఏలేది నేనే' అని అహంకరించాడు.
'నీ కెందుకు మూలను కూర్చో'మని హుంకరించాడు.
'శ్రేయస్సాధనకోసం కృషి చేస్తా'నని లేచాడు.

కర్కశకరముల భూమిని త్రవ్వగ
క్షారజలములే ఊరినవి
ఉప్పునీటినీ పారింపంగా
ఊషరభూమిగ మారినది,
ఊషరభూమిని పైరు పెట్టగా
ఉమ్మెత్తలే పండినవి,
సాధుజనులకూ సామాన్యులకూ
సౌఖ్యము లన్నియు ఎండినవి.
సత్యాన్వేషణకోసము శాస్త్రము త్రవ్వి చూడగా
వచ్చినవి
అణుబాంబులూ, ఉదజని బాంబులు ఇంకా ఎన్నో
అవీ ఇవీ.
దండపాలనము చేశాడు
ఖండనభూమిని దూకాడు,
పురుషుడు చేసిన గాయాలను జాలితో
పుణ్యపురంధ్రియె మాన్పింది.
ప్రజాస్వామ్య మంటే పురుషస్వామ్యం కాదు,
అతివలు లేకుంటే అందులో స్వామ్యం లేదు.
ప్రజాస్వామ్య మంటే మానవత్వం ;
మానవత్వ మంటే సమానత్వం ;
సమానత్వ మంటే సహకారతత్త్వం ;
కొన్నాళ్లు నిలుస్తే మంచిది పురుషుల అధికారపాలనం,
అభ్యుదయానికి అవసరం అతివల అనురాగలాలనం.
పురుషునికి సృజనశక్తి లొచ్చు, సంహారణశక్తి హెచ్చు;
మహిళ జనయిత్రి ; ఆమెకు అనుకంప పెచ్చు.
సమరప్రీతి గలపురుషునికి సామరస్యం పూజ్యం,
అతనికి కొన్నాళ్లపాటు రాజ్యపాలనం త్యాజ్యం.
ప్రజాస్వామ్యపరివృద్ధికి గ్రామమే మూలకందం;
గ్రామపాలనకు మరి పంచాయతీయే తగు చందం.

వేలపతి సంఘాలమబెట్టీ
అతి చౌకగ అప్పుల నిచ్చే
పేద ప్రజ ప్రతిష్ఠ నిలిపే
ఆప్తుండగు అధికారితడూ ! ॥మే॥

5

ఇడుగో మన విద్యా బోధక్
ఇడుగిడుగో మన యస్. ఈ. ఓ.
మన సమితికి సంబంధం గల
ప్రతి సంగతి తెలిసిన వాడూ !
జనులందరి మత్తు వదిల్చి
చైతన్యం రేకెత్తించీ
జాతీయత పెంపొందించే
జనసేవకుడగు అధికారీ ! ॥మే॥

6

ఇడుగిడుగో మన బీ. డి. వో !
మన సమితికి ప్రధాని ఇతడే !
మన సమితికి సంబంధించిన
చట్టాలను విపులంజేసీ
సరిగా మన సమితిని నడిపే
జనహితుడగు అధికారితడూ ॥మే॥

7

నేనే మీ విలేజి వర్కర్ !
ఈ సమితికి పునాది పత్థర్
పనులన్నిట సమస్యలన్నిట
ఉభయులకూ ఘన అనుబంధం
ఏ పల్లెకు ఏం కావాలో
ఏ పనులకు ఏం చెయ్యాలో
వివరించే బాధ్యత నాదే !
మిము నడిపే భారం నాదే ! ॥మే॥

8

ఇది మన పంచాయతి రాజ్యం !
మీ ఓటుతో నడిచే రాజ్యం !
మీరంత తెలిసి నడిస్తే
మనదే మరి సమస్త సౌఖ్యం ! ॥మే॥

9

మీ ఓటుకు విలువ తెలిస్తే
మీ ధర్మం నిర్వర్తిస్తే
నిజాయితీ ప్రతినిధులొస్తే
మనసారా పనులు నడిస్తే
మన సమితే ప్రజా ప్రభుత్వం
ప్రతి గ్రామం సుఖాల స్వర్గం ! ॥మే॥

10

మన సమితికి కేటాయించిన
ప్రతి పైసా ప్రజదేనండీ
ఏ ఒక్కరి ముల్లె కాదండీ
భేదాల్లను మాని పదండీ ! ॥మే॥

11

ఈ దేశం అందరిదండీ
ముఠా తగూ మన కొద్దండీ
దేశంబును ప్రేమించండీ
మున్ముందుకు నడిపించండీ ! ॥మే॥

12

ఓ కూలీ రైతుల్లారా !
ఓ యువతీ యువకుల్లారా !
లేలెండోయ్ నడుములు గట్టి
రారండోయ్ ప్రతిజ్ఞ బట్టి ! ॥మే॥

---

# పొదుపు ఉద్యమం

—డి. బసవయ్య

*(ఈ పాటకు 1959 లో జరిగిన పొదుపు ఉద్యమం పోటీలో ప్రథమ బహుమతి వచ్చింది.)*

చిన్ని మొత్తాల పొదుపు ఉద్యమం - ఎన్నదగినదోరన్నా !
అన్ని విధంబుల మేలు కూర్చే - పెన్నిధిరా ఓరన్నా !

బక్క చిక్కిన బడుగు మొదలుకొని - బడాబడా భూస్వాములవరకు
చిన్న పిల్లలకు కన్నెపడుచులకు - సంసారులకు సమస్త జనులకు ॥చి॥

పొదుపు చేయు ప్రతి పైసాకూడా - భూరి సుఖాలకు కట్టని మేడ
స్వయముగ పెంచిన వృక్షపు నీడ - జాతికంతటికి తొలగినపీడ ॥చి॥

డబ్బు దాచుటకు ముందుకు సాగి - దగ్గఱ పోస్టాఫీసునకేగి
పొదుపు ఉద్యమపు పుణ్యోదంతం-పూర్తిగ తెలిసి తరించుము సొంతం ॥చి॥

పావల డబ్బులు మిగిల్చిరోజొక - పత్రముకొంటే చాలు
దేవుని తోడుగ అదియే చివరకు - తెచ్చును వేలకు వేలు ॥చి॥

కాఫీ, టీలకు పెట్టే దానిలో - కనీస మొత్తం తీసి
సిగరెట్లకు తగలేసే దానిలో - చిన్ని విత్తమును దాచి ॥చి॥

చేసిన కొద్దీ ఖర్చేయగును - చేయకున్న యేమగును ?
అంతో యింతో నీకు మిగులును - అది దాచుటయే తగును ॥చి॥

దాచిన డబ్బుకు వడ్డీ యిచ్చి - దాచినందులకు మెచ్చి
అవసరమప్పుడు ప్రభుత్వమేనీ - కందించును నిక్కచ్చి ॥చి॥

దేశ సేవలో పాలు పంచుకొని - దిన దినంబును దిటవు పెంచుకొని
వ్యర్థపు ఖర్చుల పేరు త్రెంచుకొని - అర్థము దాచితివనిపించుకొని ॥చి॥

ప్రజలకు సౌఖ్యం, ప్రతిష్ఠ ముఖ్యం - నిజముగ అది ధనమునకే శక్యం
ధనము దాచినా, పొదుపు నేర్చినా - మన దేశానికి మఱీఉపయుక్తం ॥చి॥

గడ్డి పరకలొక కొన్ని కలిపినా - దొడ్డయేనుగును బంధించునటుల్
గడ్డు పరిస్థితి దాటగలము మీ - రిడకొద్ది మొత్తాలు కలిపినా ॥చి॥

దిక్కు దివాణములేని పేదలకు - దిక్కులు చూచే దీనాననులకు
ఇక్కట్టులతో కుమిలే జనులకు - చక్కని సదుపాయాలు చేయుటకు ॥చి॥

భారత భూమిని ప్రకృతి సంపద - బహు పుష్కలముగ పొదుకొన్నది
ధనముంటేనే అది వినియోగం - దానికి తోడ్పడుటే నీ త్యాగం ॥చి॥

నదుల జలాలను పదిలము చేసి - నలుదిక్కులకు పంపాలంటే
ఆనకట్టలు కట్టాలంటే - అందరికన్నము పెట్టాలంటే ॥చి॥

విద్యుచ్ఛక్తి, విరివిగ భుక్తి - వేడుక గొలిపే వీధుల రక్తి
విద్యాలయములు వైద్యాలయములు-వినోదస్థలములు వినిర్మించుటకు ॥చి॥

తలకు పావలా నిలవ చేసినా - కలిసి కోట్లరూపాయలు పెరుగు
ఉడుతా భక్తిగ సహాయపడినా - ఉజ్జ్వలమగు భవిష్యత్తు జరుగును ॥చి॥

ముదమున అల్లుళ్ళకిచ్చు కానుక - పొదుపు సర్టిఫిక్కేట్లరూపమున
కొనియిచ్చినచో రెండు విధాలుగ -పనికలిసివచ్చు, మన ఘనతహెచ్చు ॥చి॥

ప్రపంచమంతా పురోగమించ - భరత దేశమేలా తలవంచ ?
ప్రగతికి మూలం పొదుపుఉద్యమం - సుగతికి మార్గం జరుగుగ తథ్యం ॥చి॥

దేశభక్తియే ప్రధాన మన్నా ! - దేశ క్షేమమే నిదానమన్నా !
శక్తికొద్ది, యేకొద్ది మొత్తమొ - శ్రద్ధాలోపము లేక దాచుమా ॥చి॥

మతము తోడ సంబంధము లేదు - గతమునకై విలపింపగ రాదు
ఇపుడు లభించిన యీ అవకాశం - ఎవరూ వదలకుడూ లవలేశం ॥చి॥

దేశ రక్షణకు బలమగు సేన - దీపించాలి స్వతంత్ర జగాన
దేనికైన ధనమక్కరగాన - తెగించి నడువుము పొదుపు పథాన ॥చి॥

ప్రభుత్వమే ప్రజ, ప్రజే ప్రభుత్వం - ప్రస్తుత మిద్దరికిది ఘన సత్వం
పరస్పరంబగు సహాయ తత్వం - భారత జాతికి ప్రాణ సమత్వం ॥చి॥

---

జానపద గేయం:

# పొదుపు చేద్దాం బావ....

—అన్నపరెడ్డి రాఘవరావు

పిల్ల:— పొదుపు చేద్దాం బావ- పొదుపు చేద్దాం
సంసారపు ఖర్చు- అదుపు చేద్దాం.-

బావ:— పొదుపెందుకే పిల్లా- పొదుపెందుకే
అదుపు చేస్తం మనకి- అలిమిగాదె పిల్లా-

పిల్ల:— పొదుపెందుకా బావ- పొదుపెందుకా
పొదుపు చేసుకుంటే- ముందు బ్రతుకు దెరువౌతాది.

(పొదుపు)

బావ:— కూడ బెట్టితే మనం- మేడగడతామటే
వెనక వేసిన మనం- ముందుకెల్తామటే
కూటికే కూలంత- సున్న యాతుంటేను
మనకెందుకారగడ- గమ్మునుండవె పిల్లా-

(పొదుపు)

పిల్ల:— కుటుంబ నియంత్రమనే యంత్ర ముండాదిలే
కూలి డబ్బులు మిగిల్చే- మంత్ర ముండాదిలే
సత్తు వుండగానే కొను బావ- పొదుపు పత్రాలు
ముసలోల్లమయ్యాక- వత్తాది మొత్తంబు

(పొదుపెందుకా)

బావ:— దొరలు వచ్చి దాని- మెచ్చు కున్నారు.
దొంగలొచ్చిదాని- దొంగిలించేరు.
ఆఫీసుల చుట్టు- తిప్పుకుంటారు
వద్దు పదవే పిల్లా- మనకా గ్రుడ్డిలాట

(పొదుపు)

పిల్ల:– అయివేజు తక్కువ- పిల్లలేమో ఎక్కువ
నావళ్ళంత గుల్ల- యిర్కటం యిల్లంత
తగ్గించే మార్గాలు- వల్ల నంటావాయె.
తెలుసు కోనాలి బావ- ముందుగతిని మనము–

॥పొదుపెందుకా॥

బావ:– బంగారంపై మోజు- పోయిందచే పిల్లా.
సింగారంపై రోజు- సీదరిత్తుండావు
సంసారంలో తేజు- సరి జేసుకుందామా
సూతరాలు తెల్సుకొని బూజు దులపాలికను.

॥పొదుపు॥

పిల్ల:– పొదుపు ఉద్దేం తట్టు చూడాలి
పొదుపు చేసికొని పై మెట్టు ఎక్కాలి.
ప్రజలలో ఈకట్టు- రావాలి.
ప్రచార గీతం చుట్టూ- పాడాలి.

॥పొదుపెందుకా॥

బావ:– ప్రాజెక్టులందున- మన పాలున్నదని
అభివృద్ధి మన- అండనున్నదని తెల్పి
(ఏయ్! పిల్లా! సరేలే)
ఇక మన దొకచే మాట
రావే పోదాం. పొదుపు చేసే బాట

పిల్ల:–
బావ:– } (ఇద్దరు కలిసి)

పొదుపు చేసే పథకాలు ఆదరిత్తుంచేను
అప్పు భారం తరిగి- మెప్పులొందేవయ్యా-
జాతీయ ఆదాయం- జ్యోతిలా వెలుగు
ఖ్యాతి గాంతుము- మన జాతియంత
కొద్ది కొద్దిగా మీరు కూడ బెడితేను
పెద్ద మొత్త మవునని తెలియకుండయా
సుద్దులు చెప్పేటి- పెద్ద వారందరు
పొదుపు ఉద్యము- పోత్సహించడయ్యా.

॥పొదుపెందుకా॥

# పొదుపు ఉద్యమం

—క. లక్ష్మీనరసయ్య

(1959 లో జరిగిన జాతీయ పొదుపు ఉద్యమం 'పాటలు, గేయాల' పోటీలో ఈ గేయానికి ద్వితీయ బహుమతి లభించింది.)

పిన్నలార—పెద్దలార
పేదలార—ధనికులార
భారత సౌభాగ్య భావి
పౌరులార—పౌరులార
పొందికైనమాట చెబుత వినండీ !
పొదుపు ఉద్యమం పథకం గనండీ !

స్వయంవృద్ధి సాధనకై
సర్వశక్తి సమకూర్చుక
భావిభారతదేశపు సౌ
భాగ్యమార్గమందు నడచి
దేశసంపదలను పెంచుకోనండీ !
దివిని అవనిపైన నిల్పుకోనండీ !

మీ రాబడిలోన కొంత
భారత జాతీయనిధికి
ప్రణాళికల విజయమునకు
ఋణరూపముగా నొసంగి
జాతివృద్ధికై సహాయపడండీ !
స్వంతాదాయముల వృద్ధి గనండీ !

దేశంతో మీరుగూడ
మీ శక్తి సమీకరించి
ప్రతిపల్లెను స్వర్లోక
ప్రాయముగా మార్చుటకై
జాతినేత పిలుపు నందుకోనండీ !
సౌభ్రాతృత్వమును పెంచుకోనండీ !

పన్నెండేడుల పరిమితి
"ప్లాన్ సేవింగ్ సర్టిఫికేట్లు"
పదేండ్లలో చెల్లించు—"డి
పాజిట్టుల సర్టిఫికేట్లు"
"అన్యూయిటీ సర్టిఫికేట్లు కొనండీ !"
"అధిక లాభములను పంచుకొనండీ !"

భాక్రనంగల్—నాగార్జున
వంటి గొప్ప ప్రాజెక్టులు
ఉక్కు, ఇనుము, బొగ్గు, నూనె
పెక్కు ఫ్యాక్టరీలు—గనులు
ప్రాతిపదిక విద్య, పెంపుగనండీ !
భౌతిక సంపదల పెంచుకొనండీ !

సాంఘిక సంక్షేమమ్మును
సాంస్కృతి కాభ్యుదయమ్మును
సామరస్య భావములను
సమానావకాశమును
స్థాపించుటకై ముందుకు పదండీ !
బాపూజీ బోధ యిదే కదండీ !

చిన్నలార-పెద్దలార
పేదలార-ధనికులార
భారత సౌభాగ్య భావి
పౌరులార-పౌరులార
పొందికైనమాట చెబుత వినండీ !
పొదుపు ఉద్యమం పథకం గనండీ !

# తోలు బొమ్మలాట

—నాయని సుబ్బారావు

ఆంధ్ర దేశమ్ములో బొమ్మలాట పల్లె!
అచట నొక మానవ బ్రహ్మయవతరించి,
జింకతోల్ కత్తిరించి సృష్టించి సురల,
మేకతోల్ కత్తిరించి నిర్మించి నరుల.

పదను పెట్టి మైకారేకు వలే, నిగార
మైన రంగుల నిరువైపులంచు పులిమి,
సంఘటించిన చిన్ని బెజ్జమ్ములవియు
నేడు వారాల సొమ్ములై యెనక మెసగి.

దానవుల పక్షిగమి జంతుతతినికూర్చి,
ఉల్లిపొర వంటి తెరమీద యుగయుగాల
నీడలుగ తోలు బొమ్మల నాడి నపుడె,
ఆంధ్ర మా సీమ మొక బొమ్మలాట పల్లె!

ఆ జీవమ్ములు పట్టివెంట గొనిపోనా తోలుబొమ్మల్, సుమ
త్రాజావా మలయాది దేశముల, సర్వ శ్రీదముల్, భారతో
ర్వీజాతామల సంస్కృతి ప్రభలు నింపెన్; తజ్జనానీక హృ
ద్రా జీవమ్ములు రామ భారత కథా రాగమ్ములై విచ్చుకోన్!

కృత్త పక్షజటాయు వేగు పుణ్య జగమ్ము
లరయురామ స్వామి యభయ ముద్ర,
దైత్యాపహృత వీతధైర్య సీతా శోక
మూర్తి దేవునికెత్తు మోడ్పుకేలు,
తత్క్షణ భయజాత దశదిశా రోమాంచ
కము దశానను శిరః కంపనమ్ము,

లంకా దహన సముల్లాసాంజనేయాతి
వేల లాంగూల సంచాలనమ్ము,

పట్టి, చేతులు జోడించి, భయనభంగి
తలలు విదలించి, ఘూన ఘోంతరము సుడియ
వాల మల్లార్చి, తెరవెన్క వన్నెలాడి
పాటలో భావమై బొమ్మలాట చెలగు !

పరసతీ వాంఛా విపత్పయోనిధి మున్గి
నశియించు కీచకోన్మాదు లగుచు,
దాయాదులకు భాగదాన మీని యధర్మ
సక్త దుర్యోధన స్వాములగుచు,
కులకాంత సభకీడ్చి వలువ లొల్పించు పా
పాను వర్తులు దుస్ససేను లగుచు,
విలయ వేళా కృశానుల లీల శాత్రవ
సేన నేర్చెడు పాండు సూను లగుచు,

ఎల్లెడల తానయై విజృంభించు విజయ
రథము నడిపించు పార్థ సారథులు నగుచు,
మర్మ మెరిగిన తెరవెన్క మాయకాని
యూపులో త్రోపులో బొమ్మలూగియాడు !

వారు ప్రశస్త ధర్మ పథవర్తను, లెందు పరోపకారమే
కోరి చరింత్రు, స్వార్థమును గోరి పరాహిత కార్యకర్మరుల్,
వారు నిరస్తధర్ము; లనివారిత మీ తెర బొమ్మలాటలో
వారునువారు పండితులు; వారుసుమంత్రులు,వారు సౌబలుల్ !

జాలుగా మురిపాల చాలుగా జాతిహో
స్యములోని నిద్దా పసందు లొలయ,
ఘుక్కు పల్కుల వేగుజుక్క బంగారక్క
తకధిమ్మటంచు తైతక్కలాడ,
సీటుగా వలెవాటు గోటుగా వలపుల
ఫేటగా చతురిమల్ ఫెల్లి విరియ,
నసగూటి కేతిగాడెనగి బంగారక్క
తైతక్కలకు త్రొక్క తందనాలు;

అత్త! గారెలు వండవే, యత్త! వలదు
వండవే బూరెలంచును! వారి మధ్య,
వికట హాస్యమ్ము మెరయ, పానకములోని
పుడక వలెచేరు, నా జుట్టు పోలిగాడు!

ఆడునవి తోలు బొమ్మలు!
పాడును తోల్బొమ్మ! గడలు పట్టాడించే
వాడును తోల్బొమ్మె! దం
డాడు, తెనుగు తోలుబొమ్మలాట ధరిత్రిన్!

# అఖిలాంధ్రోదయము

—శనగన నరసింహస్వామి

ఆంధ్రాకాశము నావరించిన తమోహంకార హుంకారకృత్
కంధ్రానీకము జీల్చి బైటపడి స్వాతంత్ర్యార్కు డున్ముక్తనీ
రంధ్రారక్తసహస్రభానువులతో రాజిల్లుచున్నాడు; స
ర్వాంధ్రుల్, సాగుడు తత్ప్రకాశవశరథ్యానందపాథేయులై.

2

అఖిలాంధ్రోదయ కారణ
శిఖరము మనవాడు పొట్టి శ్రీరాముం డీ
సుఖ మతని నిరశనవ్రత
మఖమునకు ఫలం బటన్నమాట మఱతురా ?

3

సర్వాంధ్రము సాధించిన
గర్వముతో, ముందుచూపు కలిగి, భవిష్యత్
పర్వదినమ్ములు జరుపుడు
పూర్వాంధ్ర మహేంద్ర విభవ పుణ్యస్మృతితో.

4

శ్రీమద్భాగతమ్ములో గలదు ప్రాచీనాంధ్ర సమ్రాట్కథా
సామగ్ర్యం బది మొన్న పుట్టె నని నిశ్శ్వాసింతువా ? వేదకా
లామోదాంక మునైతరేయ కథన మ్మాలింపవో ? వైభవం
బేమీ ? యందువటోయి ! సాక్ష్య మిదిగో, యీసారి దర్శింపుమా !

5

దక్షారామమునందు భీమపతిగా దర్పించి, శ్రీభూమిభృత్
వక్షోవాటిని మల్లికార్జునుడుగా వాసించి, శ్రీకాళహ
స్తి క్షేత్రమ్మున నీశ్వరాహ్వయుడుగా దీపించి, మున్ప్రొద్దు సం
రక్షించున్ శివు డీ త్రిలింగధరణీరాజ్యం బజేయమ్ముగా.

6

ఒక మొకమ్మున వేదనికరమ్ము వల్లించి
చతురాస్యు నన్మత్తు సలిపినారు;
శితహేతి ముందుగా ప్రతిఫలించిన జయేం
దిరకు నెత్తురుబొట్టు దిద్దినారు;
సంఖ్యేయధను డన్న జాలితో కిన్నరే
శ్వరునకు ధన మప్పు కురిసినారు;
భుజభూషణం బంచు నిజహాలమ్ముల బల
భద్రు నాగలి భంగపఱచినారు;

ఇచటి బ్రాహ్మణపుంగవు, లిచటి క్షత్రి
యేంద్రు, లిచ్చటి వైశ్యులు, నిచటి శూద్రు
లిది ప్రబంధావళీ ముఖగదితవినుతి
మాత్ర మనజూడ కిది యున్నమాట సుమ్మ!

7

మగధదేశముదాక మనమాట చెల్లెను
'శాతవాహనుల' దోశ్శౌర్యగరిమ;
బుద్ధదేవుని కీర్తి పొంగి దిక్కులు ముట్టె
'నిక్ష్వాకు రాజుల' యీవులందు;
వేదమతము పునర్వికసించి ఫలియించె
'విష్ణుకుండినుల'య వేడ్కయందు;
శిలకు జీవము వచ్చి జలధి లంఘించె 'శా
లంకాయనుల' సుపాలన దినముల;

లబ్ధశాసన లిపిమాత్ర లాంఛనములు,
శిథిల శిల్పావశేష విచిత్రగతులు,
కాలవేగ విలీన గాథా లహరులు;
ఆ మహావైభవములు నే డర్థ మగునె!

## 8

రాకొమరున కొకధర్మము
లోకుల కొకధర్మ మన్న లుబ్ధలు గారి
క్ష్మాకాంతు; లపుడు తడిసిరి
ప్రాకృతులును కనకవర్షపాతమునందున్.

## 9

భారత భారతీ విభవపారగ మైన బృహత్కథాసుధా
వారిధి కేత మెత్తిన తపస్వి గుణాఢ్యుడు తెల్గువాడు; శృం
గారవిలాసలాస్యజని కాశ్యపి, "సప్తశతి ప్రబంధ" మాం
ధ్రోరు వసుంధరా జనపదోజ్జ్వల జీవనసారమేసుమా!

## 10

కవికులగురు లీలాసన
సవిధాసన మందు కీవి సారించు మహా
కవి మునిమణికోటీరుడు
భవభూతి, జనించినట్టి ప్రాంతం బిదియే.

## 11

సారకవితోద్వదయ నవ
భారవి, రోదోంతరాళ భాగ్విమలయశో
భారవి, సదర్థగౌరవ
భారవి, జనియించినట్టి ప్రాంతం బిదియే.

## 12

కవితాగంగా లహరీ
జవమున యవనేందు తేల్పజాలిన రసిక
ప్రవరుడు, పండితరాయలు
భవ మందిన పుణ్యభూమి భాగం బిదియే.

## 13

భారతాంధ్రీకృతి ప్రథమావతారకా
రణకీర్తి, చాళుక్య రాజరాజు;
తౌరుష్కవాహినీ దారుణోల్బణసేతు
రూపుండు; కాకతి రుద్రరాజు;
ప్రాకృతాంధ్రామర భాషావనీ మధు
రేఖ, శ్రీకోమటి రెడ్డిరాజు;
సాహిత్య సమరనిష్ఠాసవ్యసాచిత్వ
గేయుండు, తుళువ శ్రీకృష్ణరాజు;

> ఒకరితరువాత నొకరుగా నుర్వి నిలుపు
> సాహితీరణ దిగ్జయ స్తంభపాళి;
> నేటికిని మొక్కవోవక నిలిచి పిలిచి
> తెలుగువారికి దిటవు నందించునోయి!

## 14

నన్నయ్య, వాగర్థనవవైభవాద్వైతి;
నన్నెచోడుడు, రసామ్నాయగాత;
తిక్కన్న, కవిరాజు తెలుగుల జీవనం;
బెజ్జన్న, ప్రతిభామహేశ్వరుండు;

శ్రీనాథు, డనవద్యసిద్ధశయ్యాశాలి;
పోతన్న, జాతికి పుల్కరింత;
కృష్ణరాయడు, కళాకేళీవిలాసమ్ము;
పెద్దనార్యుడు, సుధాపీనవృష్టి;

రామభూషణు, డపరనీరజభవుండు;
చేమకూర, చమత్కృతిస్తోమభూమి;
తారతమ్యపరీక్షకు తగరు పూర్వ
కవివరేణ్యులు వా రగ్రగణ్యు లెపుడు.

15

ఏవంవిధ పూర్వాంధ్ర మ
హావైభవ మెల్ల కాలహతమై పునరు
జ్జీవించుచున్న దిప్పుడు
రావోయి! ఆంధ్రసోదరా! కనుగొనగా.

16

వాటము లైన పూర్వకవివాక్కుల తత్త్వ మెఱింగి, యాంగ్లవాగ
ఝాటపరీమళోర్మికల సారము లాని, యుదాత్తభావనా
పాటవవత్కవిత్వములు బల్కుచు, వాణికి మల్లెపూల క్రొం
బాటలు దీర్చు నవ్యకవివర్యు లలంతుల బోవువారలే!

17

బహుముఖసుఖాభిముఖముగ
నహరహము గమించుచుండె నహమహమిక నీ
మహితాంధ్రజనపదమ్ములు;
విహరింపగరమ్ము! కనులు, వీను లలరగా.

18

అది నాగార్జునసాగర, మ్మది విశాలాంధ్రావనీ సుప్రజా
త్రిదశప్రాగ్భవపుణ్యలబ్ధఫలసాంద్రీభూతసారమ్ము, దు
ర్మదదారిద్ర్యదవాగ్ని సేచకసుధాంభఃపూర, ముత్సాహివై,
పదవోయీ! యిక తత్ప్రదేశవిభవప్రాగ్భార మీక్షింపగా.

---